# CHENU CHEKKINA SILPALU

**Somepalli Venkata Subbaiah**
E-Mail: svsomepalli@gmail.com

*First Edition*: January, 2019

*Cover Design:* Abbu Arts, Chennai

*Copies available at:*
CRESCENT PUBLICATIONS
29-25-43A, Vemuri Vari Street
Suryarao Pet, VIJAYAWADA - 520 002
E-Mail: crescent.vja@gmail.com

*Printed at:*
RATNA PRINTING WORKS
VIJAYAWADA - 520 002
Phone: 9030 663666



Rs. **60**/-

# అంకితం



సాహితీ పోషకుడు,

తెలుగు భాషా ప్రియుడు,

సౌజన్యమూర్తి, ఆప్త మిత్రుడు

**పి.వి.ఎస్. సూర్యనారాయణ రాజు** కి...

**Dr. N. Gopi,** M.A. (Telugu), Ph.D.
Professor of Telugu (Retd.)
Emeritus Fellow
Former Vice-Chancellor, P.S. Telugu University
Former Dean, Faculty of Arts
Osmania University, Hyderabad.



(Accredited by NAAC with Five Stars)

Off : (040) 27682294
Res : (040) 27037585
Cell : 9391028496
Email: prof.ngopi@gmail.com

# హృదయశిల్పాలు

సోమేపల్లి వెంకటసుబ్బయ్యగారు నాకు దేవుడిచ్చిన సోదరుడు. 2001లో అనుకుంటాను... ఆయన తణుకులో ఎమ్.ఆర్.ఓ.గా ఉన్నప్పుడు ఆయన తొలి నానీల పుస్తకం 'తొలకరి చినుకులు'ను ఆవిష్కరించడానికి వెళ్లాను. అది మొదలు మా అనుబంధం బలపడుతూ వచ్చింది. ఆయన కలం నుంచి నానీల రచన ధారగా వెలువడుతూనే ఉంది. 'రెప్పల చప్పుడు', 'పచ్చని వెన్నెల' సంపుటాలు కూడా ఆణిముత్యాల్లాంటి నానీలతో వెలువడ్డాయి. 'రెప్పల చప్పుడు'ను విజయవాడలో నా శ్రీమతి ఎన్. అరుణ ఆవిష్కరించినట్టు గుర్తు. ఇప్పుడు 'చేను చెక్కిన శిల్పాలు' పేరుతో నాలుగో నానీల సంపుటిని వెలువరిస్తున్నారు. శ్రీ సోమేపల్లి నానీల సింహద్వారం గుండా కవిత్వంలోకి ప్రవేశించినా కేవలం నానీలతో ఆగిపోలేదు. 'లోయలో మనిషి', 'చల్లకవ్వం', 'తదేకగీతం' వంటి గట్టి వచన కవితా సంపుటాలు కూడా ప్రచురించారు. 'తదేకగీతం'ను నాకు అంకితం చేసి నన్ను పులకింపజేసారు. ఈ పుస్తకం హిందీలోకి అనువాదమయింది. నానీల దశాబ్ది ఉత్సవాల్లో 'పచ్చని వెన్నెల' హైదరాబాద్‌లో సినారె చేతులమీదుగా ఆవిష్కృతమైంది.

శ్రీ సోమేపల్లి ఆషామాషీ కవి కాదు. డిప్యూటీ కలెక్టర్ పదవిదాకా ఎదిగినా అధికారదర్పమంటని అచ్చమైన రైతుబిడ్డ. క్షణం తీరికలేని రెవెన్యూ పదవిలో ఉన్నా గత 16 సంవత్సరాల్లో 7 పుస్తకాలు వెలువరించారు. టైమ్ దొరికితే ఇంకెన్నో రాసి ఉండేవారు. అయితే ఒక్కటి... హృదయం చీల్చుకురాకుండా ఆయనేదీ రాయలేదు. తన జీవన నేపథ్యమైన వ్యవసాయ అనుభవంలోంచే ఆయన కవిత్వాన్ని పలికారు. నిజాయితీ ఆయన కవిత్వానికి నైసర్గికం. కవిత్వం శ్రీ సోమేపల్లికి ఉబలాటం కాదు, ఒక ఉద్వేగం. ప్రయాణంలో ఉన్నా, ఫైళ్లలో కూరుకుపోయినా ఆయన మానవీయ స్పందనలు అక్షరాలుగా రూపుదిద్దుకుంటాయి. అది ఆయన స్వభావం.

నానీల రచనతోనే ఊరుకోక ఆయన ఎందరో నానీకవులకు ఊతమిచ్చారు. నానీల కవి నాగిశెట్టి తాతయ్యనాయుడు వెలుగులోకి రావడానికి తొలిరోజుల్లో ఆయన

చేయూత అమోఘం. గుంటూరు జిల్లా రచయితల సంఘంను స్థాపించి, ఆయన చేస్తున్న సాహిత్యసేవ అపూర్వం. హృదయవాది అయినా ప్రపంచీకరణ పర్యవసానాలను అర్థంచేసుకున్న మేధావి శ్రీ సోమేపల్లి.

ఇక ఇవాల్టి 'చేను చెక్కిన శిల్పాలు' తాజా నానీల సంపుటి. అన్నట్టు... పుస్తకాలకు పేర్లు పెట్టడంలో ఆయనకు ఆయనే సాటి. ఆయన గ్రంథ శీర్షికలు లోతైనవి. గర్భితార్థాలతో వ్యాఖ్యాన సాపేక్షకమైనవి. నిరంతరం మననం చేస్తూ వాటిని వెలికి తీస్తారు. ఈ 'చేను చెక్కిన శిల్పాలు' కూడా అలాంటిదే. వ్యవసాయంలోంచి మొలచిన మొక్కలీ నానీలు. ఈ శీర్షిక వారే రాసిన ఓ నానీలోంచి తీసుకున్నారు. నానీ సంపుటాలు ఎన్నో రాయాలని వారి అభిలాష. నానీల ద్విదశాబ్ది ఉత్సవాల నాటికి ఐదింటిని కలిపి ఓ పెద్ద సంపుటంగా వెయ్యాలని నా కోరిక.

ఈ సంపుటిలోని నానీల్లో చాలావరకూ పత్రికలలో చదివినవే. క్రమం చూస్తే వీటిలో ఒక అనవరత పరిణతి, అవలీలగతీ కనిపిస్తాయి. వీటిని ఉదహరించి వ్యాఖ్యానించదలిస్తే పుటలు చాలవు. సిద్ధాన్నంగా మీ ముందున్న భోజనాన్ని నేను రుచి చూసి చెప్పినట్టుగా వుంటుంది. ఒక్కటి మాత్రం చెప్పకుండా ఉండలేకపోతున్నాను.

రైతు కష్టాలు
రాస్తానంటావా
ఎన్ని పర్వాలైనా
పర్వాలేదు

ఎంతైనా మాట్లాడొచ్చు దీని గురించి. భారతమౌతుందని ధ్వని. భారతం పద్దెనిమిది పర్వాలే. కాని రైతుభారతానికి అంతులేదు అంటున్నాడు కవి.

1997లో నేను సృష్టించిన 'నానీ' కవితారూపం ఎక్కువ ఒడిదుడుకులు లేకుండానే 20 యేళ్లను దాటబోతున్నది. ఇప్పటివరకు దాదాపు 300 నానీ సంపుటాలు వెలువడ్డాయి. విడిగా వెయ్యిమందిదాకా రాసివుంటారేమో! కాలిక పరీక్షకు నిలిచి, అప్రతిహతంగా కొనసాగుతున్న లఘురూప ప్రక్రియ నానీ. ఈ రూపోద్యమానికి శ్రీ సోమేపల్లి చేసిన దోహదాన్ని కూడా నేనీ సందర్భంగా స్మరించక తప్పదు.

నిబ్బరమైన వ్యక్తిత్వం, నిరంతర కవితా చింతనం, మానవీయ వైఖరి... ఇవన్నీ శ్రీ సోమేపల్లి సంపద. అవి ఆయన నానీల్లో ప్రతిఫలించకుండా ఎలా ఉంటాయి? ఆయనకు మరోసారి నా అభినందనలు.

గోపి

# ముందుమాట

ఇది నా నానీల నాలుగవ సంపుటి. ఈ సంపుటిలోని నానీలన్నీ ఆంధ్రజ్యోతి దినపత్రిక – గుంటూరు ఎడిషన్ అమరావతి పేజీలో ప్రచురితమయ్యాయి. ప్రచురించిన 'ఆంధ్రజ్యోతి' యాజమాన్యానికి కృతజ్ఞతలు.

'చేను చెక్కిన శిల్పాలు' కోసం ముందుమాట రాసి ఆశీస్సులు అందించిన ఆచార్య ఎన్. గోపీగారికి హృదయ పూర్వక ధన్యవాదాలు.

అర్ధాంగి విజయలక్ష్మికి, అబ్బాయిలు శ్రీవశిష్ఠ, శ్రీవిశ్వనాధవిరించికి ఆత్మీయతా ఆశీస్సులు. ఈ పుస్తక ప్రచురణకు సహకారం అందించిన మిత్రులు శ్రీ పి.వి.ఎస్. సూర్యనారాయణ రాజు (డి.టి.డి.సి. బాబు) కి కృతజ్ఞతలు.

ఈ పుస్తకంలోని నానీలకు చక్కటి చిత్రాలు వేసిన చిత్రకారుడు 'పాణి' గారికి, నా ఇతర నానీల కోసం ఫేస్‌బుక్ లో ప్రత్యేకంగా బొమ్మలు వేసిన శ్రీ మద్దినేని వెంకటేశ్వరరావు (గోగినేని కనకయ్య ఓరియంటల్ కళాశాల, తాడికొండ) గారికి ధన్యవాదాలు.

నా తల్లిదండ్రులు శ్రీ సోమేపల్లి హనుమంతరావు, నాగరత్నం గార్ల నిరంతర స్మృతిలో...

**– సోమేపల్లి వెంకటసుబ్బయ్య**

# చేను చెక్కిన శిల్పాలు



పల్లెకి
ఫస్ట్ బస్సొచ్చింది
నిండా
వాటర్ ప్యాకెట్లూ... కోలాలు



కాంక్రీటు హర్మ్యమే
అమ్మ జ్ఞాపకం
శ్మశానంలో
మొలిచిందీ అపార్ట్‌మెంట్

అక్షరమూ
విషం చిమ్ముతోందా?
కలం నిండా
కుళ్లు నింపారేమో!





బడాబాబుది
కబ్జా దాహం
చెరువును
చేను మింగేసింది

చేను చెక్కిన
శిల్పాన్ని నేను
ఆటుపోట్లకు
అదరను... బెదరను...





అన్నదాత
వెన్ను విరిగింది
ధరలదీ, దళారులదీ
పంట పండింది

మతిమరపు
జబ్బేమీ రాలేదు
హఠాత్తుగా
గొప్పవాడయ్యాడంతే...





సాగులో
సవ్యసాచే అతడు
రాబడి పద్మవ్యూహంలో మాత్రం
అభిమన్యుడు

మేనినిండా
బంగారం మెరుపులు
మనసులోనే
ఛండాలపు తలపులు





తప్పు చెయ్యని వారి కోసం
వెతుకుతున్నావా?
సమాధుల్లో
ట్రైచెయ్యి



పల్లెపల్లెంతా
బంధుజనం
ఎన్నికలొస్తే
పలు రంగుల రణం



అనునిత్యం
ఆన్‌లైన్‌లోనే ఉండు
పెళ్లాం పిల్లలు మాత్రం
ఆఫ్‌లైన్...!

విత్తనమంత విమర్శ
చెట్టంత పరామర్శ
పొలం
ఓ పాఠశాల





వృద్ధాశ్రమాలకు
స్థలం లేదు
వీధి అరుగులదాకా
విస్తరించాయి

చెట్టునడుగు
పుట్టనడుగు
రైతన్న వెతలే
అడుగడుగు





ఒకప్పుడిది
గొర్రెల సంత
మార్పు పెద్దగా లేదు
ఇప్పుడు రాజకీయులు

శ్మశానం కోసం
వెతుకులాటా...?
అపార్ట్‌మెంట్లే
నేటి సజీవ సమాధులు





ఆమె
నాకు అమ్మ కూడా...
బాధల్ని దిగమింగుతుంది
ప్రేమను పంచుతుంది

అన్నదాతే
పాపం
ఇప్పుడూ ఎప్పుడూ
ఆకలికి ప్రత్యక్ష దీపం





ఫేస్‌బుక్ నిండా
ఎన్నెన్ని సుద్దులు
ఆచరణలో మాత్రం
అన్నీ హద్దులే...!



నిత్యం
పలకరిస్తూ పరవశిస్తూ
పల్లెటూళ్లలో
పిల్లకాల్వ



అంకితమేమో
అహింసామూర్తికి
వెండితెరనిండా
హింస... రక్తపాతం...



రక్తం కళ్లజూడనిదే
భుక్తి గడవదు
అదే
అతని వృత్తి



నిలువుకాళ్లపై
నిరీక్షిస్తూ ప్రయాణం
ఖండనకు ముందూ
దండన

తొంగితొంగి చూస్తూ
ముందుముందుకు
జాబిల్లికి
ఎంత బిడియమో!





చేతల్లో
అరాచక తంత్రం
జపించేది
క్రమశిక్షణ మంత్రం

అతడు
మొబైల్ మాంత్రికుడు
ఫోన్ కన్పిస్తే చాలు
'కొట్టే'స్తాడు





నేలతల్లికి
గొడుగుపట్టిందా...
విశాలంగా
విస్తరించిందీ చెట్టు!

అతడెప్పుడూ అంతే!
సంతోషానికీ
విచారానికీ
ఒకటే 'మందు'





పల్లె అద్దంలో
పట్టణం ప్రత్యక్షం
మసిబారిన
మమకారాలు

కులానికో సత్రం
మతానికో మండపం
మానవత్వమా!
ఎక్కడ నీ మందిరం?





శ్రమజీవులకు
మేడే స్ఫూర్తి
స్వార్థగగనంలో
రోహిణికార్తె

మట్టిదెంతో
మహత్యం
మంచినీ చెడునూ
సహనంతో భరిస్తుంది





కళ్లూ నీళ్లూ
కవలలేమో!
కష్టసుఖాల్లో
కలిసిపోతాయి



మా పెరటిచెట్టు
ఓ కాలనీ
కొమ్మకొమ్మకీ
పక్షులగూళ్లు



మేము ఇద్దరం
మాకు ఇద్దరు
పిల్లలు కాదు...
మొబైల్‌ఫోన్‌లు

పోయినోళ్లంతా
స్వార్థపరులు
ఏమీ ఎరగనట్టు
ఏడిపిస్తారు



నగరం
మాయమైపోలేదు
నువ్వు
చిమ్మచీకట్లో వున్నావంతే...!





చిన్నప్పటి
చీమకుట్టిన కథ
ఎప్పటికీ
తియ్యని బూటకమే



మౌనమూ
మారణాయుధమూ...
అతడు మనిషికాదు
మహిషి



అంతా
మనమంచికేనా...?
మరెందుకు
సర్దుబాట్లూ దిద్దుబాట్లూ...!

చనిపోయినా
చిగిర్చే జ్ఞాపకం
అతడూ... ఆమె
ఒకరికొకరు





జననం మరణం
శ్వాసే భేదం
మనిషి జీవితం
ఉత్త నీటిబుడగ

చల్లని నీళ్లు
వేడెక్కాయా...?
అసెంబ్లీలో చర్చ
నీళ్లపైనేమో!





నీరూ చెట్టూ
ఒకదానికొకటి
మట్టీ మనిషి
కలకాలం కలిసి



అతడు
ఆకుపచ్చని పతాక
మనసెప్పుడూ
హరితగీతమే



కవికీ
కలానికి బంధం
మట్టికి మనిషికీ
అనుబంధం

విశాల ప్రపంచం నుంచి
బందీగా
మూడుముళ్లే
సరిహద్దుగా





నేల నుదుట
నక్షత్రం
రంగురంగుల
రంగవల్లి చిత్రం

మనసు గది
తలుపు తెరిచి చూడు
వెండి వెన్నెల
పిల్ల తెమ్మెర అల





రైతు కష్టాలు
రాస్తానంటావా
ఎన్ని పర్వాలైనా
పర్వాలేదు

మదినిండా
మార్గదర్శి
గుండెలనిండా
కృతజ్ఞతా పరిమళం





అడుగుజాడ
అమ్మానాన్నదే
మరిప్పుడేది
వారి ఆనవాలు!?

హఠాత్తుగా
లక్షాధికారి
నడమంత్రదానం
ఇన్నాళ్లూ కోటీశ్వరుడు





నోరు తెరిచింది
బోరుబావి
వాడవాడంతా
విషాదపు దీవి

చెట్టుచేమల
సయ్యాట
గుండె వాకిట
వుల్లాసపు వూగులాట





మా ఊరే
మాకు గొడుగు
పిల్లాజెల్లల్ని
నడిపించేది పెద్దలే



పొలం
కొందరికి పినతల్లి
కష్టం ఓర్చుకోలేక
కౌలుకిచ్చేస్తూ...



ఊరంతా
కాంక్రీటు నీడలో!
అనుబంధాలు మాత్రం
పేకమేడలు...

ఊరూ వాడా
వుసూరుమంది
బుల్లితెరకు
కాసేపు అంతరాయం





నీళ్లలోనూ
ఊసరవెల్లి వుందా...?
కొత్తనీరు కలిస్తే
రంగు మారుతోంది!

నాకు నువ్వు
నీకు నేను
డాలర్ పరుగుపందెంలో
వారసులు





పతకాల కోసం
బరువు మోత...
కాలే కడుపుల
దేవులాట...!



ఎంత చక్కటి మొహమో
పాపం
ఫేస్‌బుక్‌లో
'చిక్కి'శల్యమయింది...!



నులకమంచంపై
కమ్మటి కల
అల్లిక జిగిబిగి
అమ్మానాన్నదే

చెరువులో
చెడుగుడు ఆట
చినుకు కోసం
యజ్ఞయాగాలట...!





వళ్లంతా
ఎంత వయ్యారం!
పిల్లగాలికి
ఊగుతోంది ఈ చెట్టు

నడిరోడ్డుపై
నిరసన నాట్లు
ఆశ్చర్యం...
విరగపండింది పంట





ఇప్పటి శోకం
ఎంత విచిత్రం
ఆదీ అంతం
అంతా ఇం'ధనం'!



అప్పుడప్పుడయినా
అందర్నీ
కలిపేది
అపార్ట్‌మెంట్ లిఫ్ట్‌లే!



ఉన్నది లేనట్లు
లేనిది ఉన్నట్లు
కనికట్టుకాదు
ఆ'కలి'పట్టు

నాన్ననీ చేనునీ
అనుసంధానం చేసేది
పంటా
పగ్గమే కదా!





ఆకాశం
ఒక రంగస్థలం
మబ్బుల నటులు
ఎన్ని వేషాలు కడ్తారో!

గుండెనిండా
మాయని గాయాలు
సెల్‌ఫోన్ చెరలో
'బాల్యం' బందీ





వాన
మాకు దూరపుబంధువు
అందుకే
ఎప్పుడోగానీ రాదు

సరదా సరదా
సెల్ఫీ
ఆదమరిచావా
ప్రాణాలను పీల్చి





ఎద్దుల గంటల
గణగణలు
పల్లె గుండెల్లో
సరిగమలు

ఎండనకా వాననకా
బతికాడు
చచ్చాకనే కాసేపు
ఏసీ బాక్సులో





రావిచెట్టు వేపచెట్టు
పెనవేసుకున్నాయి
చెట్లూ
ప్రేమించుకుంటాయి

బాల్యమిత్రుడు
కలిసాడు
తలరంగు మారిందిగాని
మనసు మెరుస్తూనే...





ఉరకలేస్తుందనుకున్నా
పత్తి
అతివృష్టి రూపంలో
మిత్తి

చెట్లకీ
పండుగలున్నాయి
చూడండి వసంతం
దండిగా వచ్చింది...





పచ్చని వెన్నెల
వెచ్చని వేకువ
గూడు వదలిన
గువ్వలు

సమాధులు తోడుగా
పక్కపక్కన
మరి మనుష్యులేమిటి
ఈ లెక్కన!





అన్నీ హత్యలే
సహజ మరణం ఉండదు
పాపం...
'కూర'జంతువులు



అతడు
ఆధునిక బ్రహ్మ
కృత్రిమ కొరత
ఇట్టే సృష్టిస్తాడు



పల్లె మూడుకాళ్లతో
కుంటుతుంది
వృద్ధాశ్రమంగా
మారుతుందేమో...!



కాలచక్రం
తిరుగుతోంది
కొందరికి ముందుకి
కొందరికి వెనక్కి



లక్ష్యంపైనే
అతని గురి
'గురివింద'లను
దూరంపెడితే సరి...!

గుండె
దిటవుచేసి చూడు
కండలు
కొండల్ని పిండిచేస్తాయి





పచ్చని చీరపై
చక్కని డిజైన్లు
చేను చెరుగుపై
పలు పంటల్లాగ

ఇప్పటికీ
అచ్చమైన పల్లె
ఎంత స్వచ్ఛంగా వుందో
ఎదురయ్యే ప్రేమవల్ల





నాగటిచాలు
నడకకి స్ఫూర్తి
జోడెద్దులు
నడతకి కీర్తి

ఆకాశంలోకి
ఎగబాకుతూ ఇళ్లు
అంతే వేగంగా
సమాజంలో కుళ్లు





ముఖం ముడతకి
ప్లాస్టిక్ సర్జరీ
మనసు మకిలికి
మందేది...?

కరెన్సీకి
చావుపుటకలు
పాతవి రద్దు
కొత్తవి పొద్దు





నీళ్లనే కాదు
నిప్పుల్నీ మోసుకొస్తుంది
కాలుష్యపు
కాలువ

నల్లడబ్బు
వొళ్లు విరుచుకుందా...
ఓట్లను
మింగుతుందేమో...!



వెలుగు
అతడి చిరునామా
ఇక తళుకులెందుకు
బెళుకులెందుకు



పల్లె మెడలో
పచ్చని మణిహారం
బారులుతీరిన
చెట్లదే సోయగం!



